మనలోకం.com
Most Lovable .com

సమర్పించు



# శ్రీ వరలక్ష్మి వ్రతకల్పం

సాధారణంగా ప్రతి ఒక్కరు సర్వమంగళకరమైన వరలక్ష్మీ వ్రతాన్ని చేసుకుంటారు. అయితే దీన్ని ఎలా చేసుకోవాలి? ఏయే పూజా ద్రవ్యాలను సిద్ధం చేసుకోవాలి. వ్రత విధానం, సంకల్పం అన్ని సమగ్రంగా 'మనలోకం' పాఠకుల కోసం ప్రత్యేకం.....

శ్రావణమాసంలో పౌర్ణమి ముందు వచ్చే శుక్రవారం రోజున వరలక్ష్మీ వ్రతాన్నిఆచరించాలి. ఆ రోజున వీలుకాకపోతే తరువాత వచ్చే శుక్రవారాలలో కూడా ఈవ్రతాన్ని చేయవచ్చు. వరలక్ష్మీ వ్రతానికి ఆదిదేవతయైన వరలక్ష్మీదేవి ఒకనాటి రాత్రిసమయంలోచారుమతికి కలలో సాక్షాత్కరించింది. సువాసినులందరూ చేసే ప్రాభవ వ్రతం. శ్రీ వరలక్ష్మీ నమస్తు వసుప్రదే, సుప్రదే శుక్రవారం రోజున జరుపుకునే వరలక్ష్మీవ్రతంతో ధన, కనక, వస్తు,వాహనాది సమృద్ధులకు మూలం. శ్రావణ శుక్రవార వ్రతాలు పాపాలు పోవడంతోపాటు, లక్ష్మీ ప్రసన్నత కలుగుతాయి.

**వ్రత విధానం :-**

వరలక్ష్మీ వ్రతాన్ని ఆచరించే రోజున ఉదయాన్నే లేచి తలస్నానం చేసి, ఇంటినిశుభ్రం చేసుకోవాలి. ఇంట్లోని పూజా మందిరంలో ఒక మండపాన్ని ఏర్పాటుచేసుకోవాలి. ఈ మండపం పైన బియ్యపు పిండితో ముగ్గువేసి, కలశం ఏర్పాటుచేసుకోవాలి. అమ్మవారి ఫోటో అమర్చు కోవాలి. పూజాసామగ్రిని అంతా సిద్ధం చేసుకోవాలి. తోరాలు ముందుగానే సిద్ధం చేసుకునిఉంచాలి. అక్షతలు, పసుపు గణపతిని సిద్ధంగా ఉంచుకోవాలి.

**శ్రీ వర లక్ష్మి పూజ సామగ్రి**

పసుపు –100 గ్రాములు

కుంకుమ–100 గ్రాములు

గంధం– 1 డబ్బా చిన్నది

విడిపూలు– అరకిలో

పూల మాలలు–6

తమలపాకులు– 30

వక్కలు– 100 గ్రాములు

ఖర్జూరములు–50 గ్రాములు

అగర్బత్తి –ఒక ప్యాకెట్

కర్పూరము–50 గ్రాములు

చిల్లర పైసలు –ముప్పయి రూపాయి బిళ్లలు

తెల్ల టవల్–1

రవిక గుడ్డలు– 2

మామిడి ఆకులు– తగినన్ని

అరటిపండ్లు – 1 డజను

ఇతర రకాల పండ్లు – ఐదు

అమ్మవారి ఫోటో– ఒకటి

కలశము –ఒకటి

కొబ్బరి కాయలు –మూడు

తెల్ల దారము లేదా నోము దారము లేదా పసుపు రాసిన కంకణం

తియ్యని ప్రసాదాలు, వీలైతే రెండు రకాలు

బియ్యం – రెండు కిలోలు

కొద్దిగా పంచామృతం లేదా పాలు 100 మి.లీ

**ఏయే పూజా సామాగ్రి శుభ్రం చేసి ఉంచుకోవాలో తెలుసుకుందాం....**

దీపాలు, గంట, హారతి ప్లేటు, స్పూన్స్, ట్రేలు, నూనె, వత్తులు, అగ్గిపెట్టె, గ్లాసులు, గిన్నెలు.

**వరలక్ష్మి వ్రతం ఇలా చేసుకోండి**

**కావలసిన వస్తువులు:**

పసుపు, కుంకుమ, వాయనం ఇవ్వడానికి అవసరమైన వస్తువులు, ఎర్రటి రవికె వస్త్రం, గంధము, పూలు, పండ్లు, ఆకులు, వక్కలు, తోరములు కట్టుకోవడానికి దారం, టెంకాయలు, దీపపుకుందులు, ఐదువత్తులతో, హారతి ఇవ్వడానికి, అవసరమైన పంచహారతి, దీపారాధనకునెయ్యి, కర్పూరం, అగరువత్తులు, బియ్యం, శనగలు మొదలైనవి.

**తోరం ఎలా తయారుచేసుకోవాలి?**

తెల్లటి దారాన్ని ఐదు లేక తొమ్మిది పోగులు తీసుకుని దానికి పసుపురాసుకోవాలి. ఆ దారానికి ఐదు లేక తొమ్మిది పూలు కట్టి ముడులు వేయాలి. అంటేఐదు లేక తొమ్మిది పోగుల దారాన్ని ఉపయోగించి, ఐదు లేక తొమ్మిదో పువ్వులతో ఐదులేక తొమ్మిది ముడులతో తోరాలను తయారుచేసుకుని, పీఠం వద్ద ఉంచి పుష్పాలు, పసుపు, కుంకుమ, అక్షతలు వేసి, తోరాలను పూజించి ఉంచుకోవాలి. ఆవిధంగా తోరాలనుతయారుచేసుకున్న తరువాత పూజకు సిద్ధంకావాలి.

## గణపతి పూజ :-

**అదౌ నిర్విఘ్నేన వ్రత పరిసమాప్త్యర్థం గణపతి పూజాం కరిష్యే**

**వక్రతుండ మహాకాయ కోటి సూర్య సమప్రభ**

**నిర్విఘ్నం కురుమేదేవో సర్వ కార్యేషు సర్వదా**

**ఆగచ్ఛ వరసిద్ధ వినాయక, అంబికా ప్రియనందన**

**పూజాగృహాణ సుముఖ, నమస్తే గణనాయక**

గణపతిపై అక్షతలు చల్లాలి. యధాశక్తి షోడశోపచార పూజ చేయాలి.

**ఓం సుముఖాయ నమః,**

**ఓం ఏకదంతాయ నమః,**

**ఓం కపిలాయ నమః,**

**ఓం గజకర్ణికాయ నమః,**

**ఓం లంబోదరాయ నమః,**

**ఓం వికటాయ నమః,**

**ఓం విఘ్నరాజాయ నమః,**

**ఓం గణాధిపాయ నమః,**

**ఓం ధూమకేతవే నమః,**

**ఓం వక్రతుండాయ నమః,**



ఓం గణాధ్యక్షాయ నమః,

ఓం ఫాలచంద్రాయ నమః,

ఓం గజాననాయ నమః,

ఓం శూర్పకర్ణాయ నమః,

ఓం హేరంబాయ నమః,

ఓం స్కందపూర్వజాయనమః,

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః

నానావిధ పరిమళపుత్ర పుష్పాణి సమర్పయామి అంటూ స్వామిపై పుష్పాలు ఉంచాలి.

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః ధూపం ఆఘ్రాపయామి

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః దీపం దర్శయామి.

స్వామివారి ముందు పళ్ళుగానీ బెల్లాన్ని గానీ నైవేద్యంగా పెట్టాలి.

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం,

భర్గోదేవస్య ధీమహి ధియోయోనఃప్రచోదయాత్!!

నీటిని నివేదన చుట్టూ జల్లుతూ, సత్యం త్వర్తేన పరిషించామి, అమృతమస్తు, అమృతో పస్తరణమసి. ఓం ప్రాణాయ స్వాహా, ఓం ఆపానాయ స్వాహా, ఓంవ్యానాయస్వాహా, ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా, ఓం బ్రహ్మేణ్యే స్వాహాగుడ సహితఫల నివేదనం సమర్పయామి, మధ్యే మధ్యే పానీయం సమర్పయామి (నీటినివదలాలి). ఓం శ్రీ మహాగణాధిపతయే నమః తాంబూలం సమర్పయామి, తాంబూలానంతరం అచమనంసమర్పయామి. (కర్పూరం వెలిగించి నీరాజనం ఇవ్వాలి) ఓం శ్రీ మహాగణాధిపతయే నమః కర్పూర నీరాజనం సమర్పయామినీరాజనానంతరం ఆచమనీయం సమర్పయామి!అనేన మాయా చరిత గణపతి అర్చనేన భగవతః సర్వాత్మకః శ్రీ గణపతిర్దేవతా సుప్రీతసుప్రసన్న వరదాభవతు! మమ యిష్టకామ్యార్థ సిద్ధిరస్తు!!

వినాయకునికి నమస్కరించి పూజ చేసిన అక్షతలు తలమీద వేసుకోవాలి. ఈ విధంగామహాగణపతి పూజను ముగించిన అనంతరం వరలక్ష్మీ వ్రతాన్ని ప్రారంభించాలి.

## కలశపూజ:



కలశపూజకలశస్య ముఖే విష్ణు కంఠే రుద్రసమాశ్రితాః

మూలేతత్ర స్థితో బ్రహ్మ మధ్యే మాతృగణ ఃస్థితాః

కుక్షౌతుస్సాగరస్సర్వే సప్తద్వీపా వసుంధరా

ఋగ్వేదోథ యజుర్వేదో స్సామవేదో అధర్వణః

అంగైశ్చ స్సహితా స్సర్వే కలశాంబు సమాశ్రితాః

ఆయాంతు గణపతి పూజార్థం దురితక్షయకారకాః గంగేచ

**యమునేచైవ గోదావరి సరస్వతి నర్మదే సింధూ కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు**

అంటూ శ్లోకాన్ని చదివి కలశంలోని నీటిని పుష్పంతో ముంచి భగవంతుడిపైన, పూజాద్రవ్యాలపైన, పూజ చేస్తున్నవారు తలపైన చల్లుకోవాలి.

## అధాంగపూజ:-

పువ్వులు లేదా అక్షతలతో కలశానికి పూజ చేయాలి.

**చంచలాయై నమః పాదౌ పూజయామి, చపలాయై నమః జానునీ పూజయామి, పీతాంబరాయైనమః ఉరుం పూజయామి, కమలవాస్యినమః కటిం పూజయామి, పద్మాలయాయైనమః నాభిం పూజయామి, మదనమాత్రేనమః స్తనౌ పూజయామి, కంబుక్ంయ నమః కంఠంపూజయామి, సుముఖాయైనమః ముఖంపూజయామి, సునేత్రాయైనమః నేత్రౌపూజయామి, రమాయైనమః కర్ణౌ పూజయామి, కమలాయైనమః శిరః పూజయామి, శ్రీవరలక్ష్మ్యైనమః సర్వాణ్యంగాని పూజయామి.**

(ఆ తరువాత పుష్పాలతో అమ్మవారిని ఈ అష్టోత్తర శతనామాలతో పూజించాలి)



## శ్రీ వరలక్ష్మీ అష్టోత్తర శతనామావళి :-

ఓం ప్రకృత్యే నమః
ఓం వికృతై నమః
ఓం విద్యాయై నమః
ఓం సర్వభూత హితప్రదాయై నమః
ఓం శ్రద్ధాయై నమః
ఓం విభూత్యే నమః
ఓం సుర్య నమః

ఓంపరమాత్మికాయై నమః
ఓం వ్యా నమః
ఓం పద్మాలయాయై నమః
ఓం శుచయే నమః
ఓంస్వాహాయై నమః
ఓం స్వధాయై నమః
ఓం సుధాయై నమః

ఓం ధన్యాయై నమః
ఓంహిరణ్మయై నమః
ఓం లక్ష్మ్యై నమః
ఓం నిత్యపుష్టాయై నమః
ఓం విభావ్యైనమః
ఓం ఆదిత్యై నమః
ఓం దిత్యై నమః
ఓం దీప్తాయై నమః
ఓం రమాయై నమః
ఓం వసుధాయై నమః
ఓం వసుధారిణై నమః
ఓం కమలాయై నమః
ఓం కాంతాయై నమః
ఓంకామాక్ష్యై నమః
ఓం క్రోధ సంభవాయై నమః
ఓం అనుగ్రహ ప్రదాయై నమః
ఓంబుద్ధ్యై నమః
ఓం అనఘాయై నమః
ఓం హరివల్లభాయై నమః
ఓం అశోకాయై నమః
ఓంఅమృతాయై నమః
ఓం దీపాయై నమః
ఓం తుష్టయే నమః
ఓం విష్ణుపత్న్యై నమః
ఓంలోకశోకవినాశ్యై నమః
ఓం ధర్మనిలయాయై నమః
ఓం కరుణాయై నమః
ఓంలోకమాత్రే నమః

ఓం పద్మప్రియాయై నమః
ఓం పద్మహస్తాయై నమః
ఓంపద్మాక్ష్యై నమః
ఓం పద్మసుంద్య నమః
ఓం పద్మోద్భవాయై నమః
ఓంపద్మముఖియై నమః
ఓం పద్మనాభప్రియాయై నమః
ఓం రమాయై నమః
ఓంపద్మమాలాధరాయై నమః
ఓం దేవ్యై నమః
ఓం పద్మిన్యై నమః
ఓం పద్మ గంధ్యైనమః
ఓం పుణ్యగంధాయై నమః
ఓం సుప్రసన్నాయై నమః
ఓం ప్రసాదాభిముఖీయైనమః
ఓం ప్రభాయై నమః
ఓం చంద్రవదనాయై నమః
ఓం చంద్రాయై నమః
ఓంచంద్రసహోద్య నమః
ఓం చతుర్భుజాయై నమః
ఓం చంద్ర రూపాయై నమః
ఓంఇందిరాయై నమః
ఓం ఇందుశీతలాయై నమః
ఓం ఆహ్లోదజన్య నమః
ఓం పుష్ట్యైనమః
ఓం శివాయై నమః
ఓం శివక్య నమః
ఓం సత్యై నమః

ఓం విమలాయై నమః
ఓం విశ్వజన్య నమః
ఓం దారిద్ర నాశ్యి నమః
ఓం ప్రీతా పుష్కర్యినమః
ఓం శాంత్యే నమః
ఓం శుక్లమాలాంబరాయై నమః
ఓం శ్రీయై నమః
ఓంభాస్క్య నమః
ఓం బిల్వ నిలయాయై నమః
ఓం వరారోహాయై నమః
ఓం యశస్వ్యినమః
ఓం వసుంధరాయై నమః
ఓం ఉదారాంగాయై నమః
ఓం హర్యిణేనమః
ఓం హేమమాల్యి నమః
ఓం ధనధాన్యకర్యే నమః
ఓం సిద్ధ్యసైణ్యనమః
ఓం స్త్రేణసౌమ్యాయై నమః
ఓం శుభప్రదాయై నమః
ఓం నృపవేశగతానందాయై నమః
ఓంవరలక్ష్మేనమః
ఓం వసుప్రదాయై నమః
ఓం శుభాయై నమః
ఓం హిరణ్యప్రాకారాయై నమః
ఓం సముద్రతనయాయై నమః
ఓం జయాయై నమః
ఓం మంగళాద్యే నమః
ఓం  విష్ణువక్షస్థల స్థితాయై నమః
ఓం ప్రసన్నాక్ష్యినమః
ఓం నారాయణసీమాశ్రితాయై నమః
ఓం దారిద్ర విధ్వంస్యినే నమః
ఓంసర్వోపద్రవ వార్యి నమః
ఓం నవదుర్గాయై నమః
ఓం మహాకాళ్యై నమః
ఓంబ్రహ్మవిష్ణుశివాత్మికాయై నమః
ఓం త్రికాలజ్ఞానసంపన్నాయై నమః
ఓంభువనేశ్వ్య నమః

## తోరపూజ  ఇలా చేయండి!

తోరాన్ని అమ్మవారి వద్ద ఉంచి అక్షతలతో ఈ క్రింది విధంగా పూజ చేయాలి.

కమలాయైనమః  ప్రథమగ్రంథిం పూజయామి,

రమాయైనమః  ద్వితీయ గ్రంథింపూజయామి,

లోకమాత్రేనమః  తృతీయ గ్రంథింపూజయామి,

విశ్వజన్యనమః  చతుర్థ గ్రంథింపూజయామి,

మహాలక్ష్మేనమః  పంచమ గ్రంథిం పూజయామి,

క్షీరాబ్ధి తనయాయై నమః  షష్ఠమ గ్రంథిం పూజయామి,

విశ్వసాక్ష్యై నమః  సప్తమగ్రంథిం పూజయామి,

చంద్రసోహోదృనమః  అష్టమగ్రంథిం పూజయామి,

శ్రీ వరలక్ష్మ్యై నమః  నవమగ్రంథిం పూజయామి.

ఈ కింది శ్లోకాలు చదువుతూ తోరం కట్టుకోవాలి

బద్నామి దక్షిణేహస్తే నవసూత్రం శుభప్రదం

పుత్రపౌత్రాభివృద్ధించ మమ సౌభాగ్యం దేహిమే రమే!!



## వ్రత కథ:

శౌనకాది మహర్షులను ఉద్దేశించి సూత మహాముని ఇలా చెప్పారు. మునులారా! స్త్రీలకు సౌభాగ్యదాయకమైన వ్రతమును ఒక దానిని పరమ శివుడు పార్వతికిచెప్పారు. లోకోపకారం కోరి ఆ వ్రతాన్ని గురించి మీకు తెలియజేస్తాను.శ్రద్ధగా వినండి.

పరమేశ్వరుడు ఒకనాడు తన భస్మసింహాసనముపై కూర్చుని ఉండగా నారదమహర్షి. ఇంద్రాది దిక్పాలకులు స్తుతిస్తోత్రములతో పరమశివుడ్ని కీర్తిస్తు న్నారు. ఆమహత్తర ఆనంద సమయంలో పార్వతీదేవి పరమేశ్వరుడ్ని ఉద్దేశించి నాథా! స్త్రీలు సర్వసౌఖ్యములు పొంది, పుత్ర పౌత్రాభివృద్ధిగా తరించుటకు తగిన వ్రతం ఒకదానిని చెప్పండి అని అడిగింది. అందుకా త్రినేత్రుడు దేవీ! నీవు కోరినవిధంగా స్త్రీలకు సకల శుభాలు కలిగించే వ్రతం ఒకటి ఉన్నది. అది వరలక్ష్మీవ్రతం. దానిని

శ్రావణమాసంలో రెండవ శుక్రవారం నాడు ఆచరించాలని చెప్పాడు.అప్పుడు పార్వతీదేవి&దేవా! ఈ వరలక్ష్మీ వ్రతాన్ని ఆదిదేవతలు ఎవరుచేశారు?ఈ వ్రతాన్ని ఎలా చేయాలో వివరంగా చెప్పండని కోరిందికాత్యాయనీ. పూర్వకాలంలో మగధ దేశంలో కుండినము అనే పట్టణం ఒకటి ఉండేది. ఆపట్టణం బంగారు కుడ్యములతో రమణీయంగా ఉండేది. ఆ పట్టణంలో చారుమతి అనే ఒకబ్రాహ్మణ స్త్రీ ఉండేది. ఆమె సుగుణవతి. వినయ విధేయతలు, భక్తిగౌరవాలు గలయోగ్యురాలు. ప్రతిరోజూ ప్రాతఃకాలాన నిద్రలేచి భర్త పాదాలకు నమస్కరించు కునిప్రాతఃకాల గృహకృత్యాలు పూర్తిచేసుకుని అత్తమామలను సేవించు కుని మితంగాసంభాషిస్తూ జీవిస్తూ ఉండేది.

వరలక్ష్మీ సాక్షాత్కారం: వరలక్ష్మీ వ్రతానికి ఆదిదేవతయైన వరలక్ష్మీదేవి ఒకనాటి రాత్రి సమయంలో చారుమతికి కలలో సాక్షాత్కరించింది. ఓ చారుమతీ ఈ శ్రావణపౌర్ణమి నాటికిముందువచ్చే శుక్రవారం నాడు నన్ను పూజించు. నీవు కోరిన వరాలు, కానుకలనుఇస్తానని చెప్పి అంతర్ధానమైంది. చారుమతి సంతోషించి. హే జననీ! నీకృపా కటాక్షములు కలిగినవారు ధన్యులు. వారు సంపన్నులుగా, విద్వాంసులుగామన్ననలు పొందుతారు. ఓ పావనీ! నా పూర్వజన్మ సుకృతం వల్ల నీ దర్శనం నాకుకలిగింది అని పరిపరివిధాల వరలక్ష్మీదేవిని స్తుతించింది. అంతలోనే చారుమతి మేల్కొని, అదంతా కలగా గుర్తించి తన కలను భర్తకు, అత్తమామలకు తెలిజేసింది. వారు చాలా సంతోషించి చారుమతిని వరలక్ష్మీవ్రతాన్ని చేసుకోమని చెప్పారు. ఊరిలోని వనితలు చారుమతి కలను గురించి విని వారు కూడా పౌర్ణమి ముందు రాబోయే శ్రావణ శుక్రవారం కోసం ఎదురుచూచూడసాగారు.శ్రావణ శుక్రవారం రోజున పట్టణంలోని స్త్రీలందరూ ఉదయాన్నే లేచి తలారాస్నానం చేసి పట్టువస్త్రాలు ధరించి చారుమతి గృహానికి చేరుకున్నారు. చారుమతితన గృహంలో మండపం ఏర్పాటుచేసి ఆ మండపంపై బియ్యంపోసి పంచపల్లవాలైన రావి, జువ్వి, మర్రి, మామిడి, ఉత్తరేణి మొదలైన ఆకులతో కలశం ఏర్పాటు చేసి వరలక్ష్మీదేవినిసంకల్ప విధులతో 'సర్వమాంగళ మాంగళ్యే శివే సర్వార్థసాధికే శరణ్యే త్రయంబకే దేవీ నారాయణి నమోస్తుతే !! అంటూ ఆహ్వానించి ప్రతిష్టించింది.

అమ్మవారిని షోడశోపచారాలతో పూజించారు. భక్ష్య, భోజ్యాలను నివేదించారు. తొమ్మిది పోగుల తోరాన్ని చేతికి కట్టుకున్నారు.ప్రదక్షిణ నమస్కారాలు చేశారు. మొదటి ప్రదక్షిణ చేయగానే కాలి అందియలుఘల్లుఘల్లున మ్రోగాయి. రెండవ ప్రదక్షిణ చేయగానే హస్తాలకు నవరత్నఖచితకంకణాలు ధగధగా మెరవసాగాయి. మూడవ ప్రదక్షిణ చేయగా అందరూ సర్వాభరణభూషితులయ్యారు. వారు చేసిన వరలక్ష్మీ వ్రతం ఫలితంగా చారుమతి గృహంతో పాటు, ఆపట్టణంలో ఇతర స్త్రీల ఇళ్లు కూడా ధన, కనక, వస్తు వాహనాలతో నిండిపోయాయి.ఆయా స్త్రీల ఇళ్ల నుండి గజతరగరథ వాహనములతో వచ్చి వారిని ఇళ్లకుతీసుకెళ్లారు. వారంతా మార్గమధ్యంలో చారుమతిని వేనోళ్ళ పొగుడుతూ ఆమెకువరలక్ష్మీ దేవి కలలో సాక్షాత్కరించి అనుగ్రహించగా ఆమె వరలక్ష్మీ వ్రతంతోతమని కూడా మహద్భాగ్యవంతులను చేసిందని ప్రశంసించారు.

వారంతా ప్రతీ సంవత్సరం వరలక్ష్మీవ్రతం చేసి సకల సౌభాగ్యాలతో సిరిసంపదలుకలిగి, సుఖజీవనం గడిపి ముక్తిని పొందారు. మునులారా& శివుడుపార్వతికి ఉపదేశించిన ఈ వరలక్ష్మీవ్రత విధానాన్ని

సవిస్తరంగా మీకువివరించాను. ఈ కథ విన్నా, ఈ వ్రతం చేసినా, ఈ వ్రతం చేసినప్పుడు చూసినా కూడాసకల సౌభాగ్యాలు, సిరిసంపదలు, ఆయురారోగ్యైశ్వర్యాలు సిద్ధిస్తాయనిసూతమహాముని శౌనకాది మహర్షులకు చెప్పారు. ఈ కథ విని అక్షతలు శిరసుపైవేసుకోవాలి. ఆ తరువాత ముత్తైదువులకు తాంబూలాలు ఇవ్వాలి. అందరికీతీర్థప్రసాదాలు ఇచ్చి, పూజ చేసినవారు కూడా తీర్థప్రసాదాలు తీసుకోవాలి.అమ్మవారికి పెట్టిన నైవేద్యాన్ని తినేయాలి.

**వరలక్ష్మీ వ్రతం చేస్తే ఏం లభిస్తాయి?**

భక్తితో వేడుకొంటే వరాలందించే తల్లి వరలక్ష్మీ దేవి. ఈ వ్రతాన్నిఆచరించడానికి ఏ నిష్ఠలు, నియమాలు, మడులు అవసరం లేదు. నిశ్చలమైన భక్తి, ఏకాగ్రచిత్తం ఉంటే చాలు. వరలక్ష్మీవ్రతం ఎంతో మంగళకరమైంది. ఈ వ్రతాన్నిచేయడంవల్ల లక్ష్మీదేవి కృప కలిగి ఐశ్వర్యం లభిస్తుంది. సకల శుభాలుకలుగుతాయి. స్త్రీలు దీర్ఘకాలం సుమంగళిగా ఉండేందుకు ఈ వ్రతం ఆచరించడంతప్పనిసరి. లక్ష్మీదేవి సంపదలనిచ్చే తల్లి. సంపదలంటే కేవలం ధనం మాత్రమేకాదు. ధాన్య సంపద, పశు సంపద, గుణ సంపద, జ్ఞాన సంపద మొదలైనవి ఎన్నో ఉన్నాయి. ఇక ఆలస్యం ఎందుకు పైన చెప్పిన శాస్త్రవిధానంతో వరలక్ష్మీ వ్రతాన్ని ఆచరించి అమ్మ అనుగ్రహాన్ని పొందండి.

**సర్వేజనాసుఖినోభవతు!**

– కేశవ

